

# రైతు-కూలీ పాటలు



ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ



# రైతు - కూలీ పాటలు



ప్రజాశక్తి కార్యాలయం
:: బెజవాడ ::

A

# విజయపతాకం

( దునియామె దునియామె హోమత్‌వాలె - మాదిరి )

ఎగురవేయి, భారత భువిపై ఎర్రపతాకము
    ,,        ,,        విజయపతాకము ॥ఎ॥
దేశరక్షణ దీక్షబూనె, ఉడుకురక్తపు యువకుల్లారా !
దేశరక్షణ దీక్షబూనె, ఉరికివచ్చే యువతుల్లారా !!
సమయమిదేగా - సరగునరాగా
వినాశమొ, విజయమొ, వెనుతిరుగనేలా ?
ధాటిజూపేమేటి వీరత, శూరత, ధీరత చాటగ
రయమున జయమొంద - రణమునకీవె రావోయీ !
అదిగో - కనవోయీ - చనవోయీ - దేశ విముక్తికి, దీక్షతో,
మిత్రులజేర్చి, శత్రులచీల్చి - మిలమిల మింటను మెరిసే జండా !
ఇలపై మనజండా - పిలుపిచ్చుచునుండా
పరుగున ఉరుకుము - పగతుర నరుకుము ॥ఎ॥

— కోగంటి గోపాలకృష్ణయ్య

# అరుణపతాక

జై, జై, జై అరుణపతాకకు జై ॥జై॥
వేగరావోయ్ కార్మికా
వేగరావోయ్ కర్షకా
కలసి మెలసి పలుకవోయ్
అరుణపతాకకు జై ॥జై॥
పీడిత ప్రజల రక్తమున్
త్రాగెడి వారలు బెదురగాన్
ఆకసమందు నెగిరెడి
అరుణపతాకకు జై ॥జై॥
కత్తులు జీల్చుకుపోయినా
నెత్తురు చేరులు పారినా
ఎత్తినజెండ దింపకోయ్
అరుణపతాకకు జై ॥జై॥

— ముక్కామల నాగభూషణం

# కదనభూమికేగుదాం
## (మార్చింగ్ సాంగ్)

కదనభూమి కేగుదాం - కత్తిదూసి దూకుదాం
ఫాసిజాన్ని రూపుమాపి - ప్రజలశక్తి చాటుదాం ॥

తెగినమొండె మరసినా - పడినశిరసు గాంచినా
అదురు బెదురు లేక యింక - ఎదురుతిరిగి గెల్చుదాం ॥

రక్తవాహినీదుదాం - శత్రువులను జీల్చుదాం
మృత్యువునకు వెరువమంచు - పోరిముక్తి గాంచుదాం ॥

కత్తిమీద నొరగుటో - కదనమందు గెల్చుటో
భారతీయ శూరవరుల - గాధలంచు జాటుదాం ॥

హిందు ముస్లిం లైక్యమై - విజృంభించి పోరుదాం
చీన రష్య దేశప్రజల - స్థానమాక్రమించేదాం ॥

జాపననగ నెంతరా - దానితాహ తెంతరా
అంతగలని తంతెమళ్ళి - అంతుదొరకునంటరా ? ॥

జపానువాణ్ని చీల్చుదాం - ప్రమాదాన్ని దాటుదాం
ప్రజలమంతకలని దివ్య - సౌఖ్య మనుభవించుదాం ॥

సమరభూమి దూకుదాం - శత్రుశిరము నరుకుదాం
జయపతాక నెత్తుదాం - విజయఘోష పెట్టుదాం ॥

— ముక్కామల నాగభూషణం

# గెరిల్లా కేక

**ఓయ్ — హోయ్ — హోయ్ — జాపాన్ — హోయ్ —**
ఓయ్. హోయ్; హోయ్. జాపానోయి
ఓయ్ హోయి. హోయి. జాపానోయి

మలయా బర్మా మ్రింగినరాక్షసి - భారత భువిపై గవిసెనురా
మతభేదంబులు మాపివేసి - అందరుకలసి ముందుకుసాగి
హిందూ ముస్లిం సోదరులారా - ఏకబాటన్ రండోయ్
భారతీయుల బానిసచేసే - పక్కాలొబల్లేల్ రక్కసిమూకల

కుత్తుకతరిగి — నెత్తురుత్రాగ
కొడవలి గొడ్డలి — కొంకి కఱ్ఱా
కండ్లకు గంతా — కారపు ముంతా
కత్తీ సుత్తీ — కాడీ మేడీ
అలుగు అంబూ — పలుగూ పార
పట్టీలేవర పగతుర నరకా రా
లేరా, అబ్బాస్, రారా సుబ్బాయి
కలవర మోహన్, కదలర యోహన్
శారద సుమతీ – బేగం బీబీ
దిందర వందర శత్రులు దునుమగ
అందరు రావలె గా.

కొండల్లో – సింహోల్లా
లోయల్లో – ఉరుముల్లా
చెట్టూ పుట్టా మిట్టా గుట్టా
పట్టీ కొట్టీ అట్టుడికించీ
గుండెలు చీల్చెడి గెరిల్లాలుగ
వందలు వేల్ లక్షల కొలది
గబగబదూకిన గజిబిజి జపాన్
లే లే, రా రా
లే లే లేవర, రా పోరుకు రా

బర్మా చీనా మలయాలల్లో
తుపాన్ లేపిన జపాన్మూకలు

పాలనుత్రాగే పాపల బట్టి
తల్లులముందే - తలలన్ తరుగా
గొల్లూగొల్లూన గోలబెట్టిరిగా!
పిల్లలవిరచి - తల్లుల చెరచి
ముక్కా-చక్కా- ముదసలి నరికి
పీనుగపెంటల కానందించెడి
జపాన్ కుక్కల - జంపేదానికి -
కాకలుదీరిన కత్తినిదూసి
గ్రక్కున రావేరా ॥ఓయ్॥

గప్ చుప్ చుప్
గప్ చుప్ చుప్
చల్, చల్ చల్

చల్ల చల్లగా మెల్ల మెల్లగా
కదలక మెదలక
కలసీ మెలసీ కనపడకుండా
కత్తులదూసి శత్రుల నరుకరా
చక్ చక్ చక్
చల్, చల్ చల్

చిన్నా పెద్దా బీదా బిక్కి
పురుషులు స్త్రీలు బారులుదీర్చి
విప్లవం వర్ధిల్లాలి!
విప్లవం వర్ధిల్లాలని
కేరింతలలో కేకలువేస్తూ
స్వతంత్ర రణముకు సాగిపోవ
బిర బిర చర చర
బిర బిర చర చర
లే లే వీరుడా రా రా ధీరుడా
ఓయ్ ॥మలయా....గవినెనురా
ఓయ్ — హోయ్ — హోయ్॥

— కోగంటి గోపాలకృష్ణయ్య

# పిలుపు

పిలచెరా పిలచెరా సోవియట్‌రష్యా।
ఎలుగెత్తి చాటెరా కార్మికుల రష్యా॥
ఎలుగెత్తి చాటెరా కర్షకుల రష్యా॥
స్వాతంత్ర్య సాధనకు సాగిరమ్మందిరా।
ఫాసిస్టు దాస్యాన ముగ్గవద్దందిరా॥ ॥పి॥

ప్రజల యుద్ధమునందు పాలుగొమ్మందిరా।
కెరటాలుగా పొంగి కదలిరమ్మందిరా॥ ॥పి॥

ఎర్రజెండా ఛాయనడచి రమ్మందిరా।
ఎర్రసైన్యపుబాట చూచుకొమ్మందిరా॥ ॥పి॥

దేశాల దేశాల చేయెత్తి పిలచిందిరా।
కోటానకోట్లకే అభయమిచ్చిందిరా॥ ॥పి॥

శ్రామిక రాజ్యంకొరకు "కూడి" రమ్మందిరా।
ప్రజలశక్తికి ఎచట తిరుగులేదందిరా॥ ॥పి॥

పశుబలాత్ములబట్టి మెడగెంటుచుందిరా।
కాకస్సుమార్గాన్ని కట్టివేసిందిరా॥ ॥పి॥

ఐక్యతాసందేశ మందుకొమ్మందిరా।
స్వేచ్ఛ భారతభూమి స్థాపించమందిరా।
గొంతెత్తిపాడుతూ గమ్యమునుచేరరా॥ ॥పి॥

పిలచెరా పిలచెరా కర్షకుల రష్యా।
పిలచెరా పిలచెరా కార్మికుల రష్యా॥

— మునిపల్లె రాజు

# రెడ్ ఆర్మీ

## ( కోలాటం పాట )

మాస్కో పొలిమేరలోనా మారణయంత్రాలు నిలిపి
మాడ్చేవేసెరా, రెడార్మీ, పూడ్చేవేసెరా
లెనీనుగ్రాడులోన శత్రువలయాము చించి
చీల్చేవేసేరా, రెడార్మీ, కూల్చేవేసెరా
స్టాలీనుగ్రాడులోన నాజీ నరహంతకులతొ
చెడుగూడాడెరా, రెడార్మీ, బలిగూడాడెరా
ఓరెల్ రంగముులోన రొమ్ము జరచీనదుష్టుల
అదరేగొట్టెరా, రెడార్మీ, బెదరేగొట్టెరా
స్మోలెన్స్కు పట్నమందు సంవత్సరమున్నవారికి
బెర్లిన్ జూపెరా, రెడార్మీ, పొర్లీపైబడెరా
ఆక్రమిత ప్రాంతాల్లొ అణగియున్నట్టి ప్రజల
పోద్బలమిచ్చెరా, రెడార్మీ, ప్రోత్సాహపర్చెరా
ఖార్కోవు ప్రాంతమందు మొండి సేనాలబట్టి
యింటిదారినే, రెడార్మీ, గెంటివేశెరా
విశ్వమంతాటిలోన విప్లవ శక్తులకు
ఉత్సాహమిచ్చెరా, రెడార్మీ ఉజ్వలపర్చెరా
రక్తాన్ని చిందించి ముక్తిని దెచ్చినావూ
మరువలే మిదె, రెడార్మీ, జోహార్లందుకో॥

— వి. శ్రీకృష్ణ

# వీర జోయా!

జోయా జోహారులందుకో - జోయా, జోయా జోహారులందుకో ॥
జోయా నీ సాహసంబు స్త్రీజాతి కంతటికి శోభాయమానమౌనుగా ॥జో॥
జోయా నీపేరువిన్న జర్మన్ ఫాసిస్టులకు సింహస్వప్నమమ్మరో ॥జో॥
చిన్నవయస్కావు, నిన్ను జర్మనులుమోద నన్నిటి నెట్లోర్చితో ॥జో॥
జోయా నినూబోలు స్త్రీ రత్నములగన్న సోవియట్ జయమొందదా ॥జో॥
ఘనమైన ఖ్యాతీ స్త్రీజాతి కంతకుగూర్చి నట్టీ నిన్ను మరతూమా ॥జో॥

# రైతుసంఘం

( రైతుకే వోటివ్వవలెనన్నా అనుమాదిరి )

రైతుసంఘము లేవవలెనన్నా మనదేశమందున
అన్నదాతలు రైతులోయన్నా
నీటివసరులె చాలవోయన్నా, అవియున్నగాని
బాగుచేయక పూడెనోయన్నా
చెరువులను ప్రాజక్టులాను; పంటకాల్వల మురుగు కా
ల్వల బాగుగను వేగామెమనము బాగుచేయగపూనుకోవలె ॥రై॥

దేశమందు కరువురోరన్నా, బెంగాలుమొదలగు
రాష్ట్రాలలోన చచ్చిరోయన్నా.
పంటలధికము చేయుటాకు, అడవుల, బంజరులదున్ని,
కోట్లకొలదీ పుట్లధాన్యము, హెచ్చుగా నుత్పత్తిచేయ ॥రై॥

తిండిదొంగల మోసమోరన్నా, లక్షలాది
దీనులాను మ్రింగెనోరన్నా.
చచ్చురేట్లకు సరకునంతా హెచ్చుగాకొని నిలువచేసి,
దొంగమార్కెటులోన వారుదోయుచుండిరి ప్రజలనెల్ల ॥రై॥

గ్రామలెఖ్ఖలు తీయుమోరన్నా, ఎంతెంత వారికి
అవసరంటో తెలుసుకోరన్నా.
ప్రజల అవసరమెల్లతీర హెచ్చుగుండినధాన్యమంతా, ఇప్పుడున్న
రేటుకు (కంట్రోల్) ప్రభుత్వానికి, అమ్మకముచేయించవేగ ॥రై॥

దాడి జాపాన్ చేసేనోయన్నా, చిచ్చుబాంబు
వల్ల ప్రజలు వేలకొలది చచ్చినారన్నా
మాతృభారతభూమిలోను, కాలుపెట్టగ చూచుచుండిన
దుష్టజాపానువాళ్ళు, దుంపతెంపగ వేగమేయిక ॥రై॥

— కామ్రేడ్ రుద్రరాజు గోపాలరాజు

# రైతు బాబా!

( సర్వమంగళనామా సీతా రామారామా అనుమాదిరి )

దేశ వెన్నెముకవు నీవె ॥రైతు బాబా॥
దీక్షబూని లేవవయ్య ..
బంజరంతా సాగుచేసి ..
పంటలధికము జేయుమయ్య ..

పొట్టకన్నము చాలినంత ..
పెట్టువాడ నీవెనయ్య ..
కబళించ భరతగడ్డను ..
కాచె గుమ్మమున జపాను ..

పొలిపొలోయని కేకబెట్టి ..
పూడ్చి పాతిపెట్టుమయ్య ..
దోపిడి లూటీలేకుండ ..
తొందరగ మేలుకొవయ్య ..

రాయలసీమంతా నేడు ..
రగులుచున్నది తిండిలేక ..
కేరళా బెంగాల్ ప్రజలు ..
కరువుతో అల్లాడుతున్నారు ..

కష్టజీవివి నీవెనయ్య ..
గట్టు దాటించరమ్మ ..
కూలి–రైతు లేకమైతే ..
కూడు గుడ్డకు లోటులేదు ..

ఎరువువేసి పంటలను ..
ఎక్కువ పండిచవయ్య ..
ఉన్న ధాన్యం ఉమ్మడిగానె ..
ఉంచి కరువు తీర్చుమయ్య ..

— కోగంటి గోపాలకృష్ణయ్య

# సంఘశక్తి

సంఘశక్తికి సాటిలేదన్నా
సంఘటిత శక్తికి లొంగు సర్వము తెలుసుకోరన్నా
సంఘశక్తితో సకల విషయములందు జయమును పొందవచ్చును
అందుచే మనరైతు సంఘమునందు జేరియు పాటుబడుమిక ॥సం॥

బానిసత్వపు బ్రతుకునకు రోసి
స్వాతంత్ర్యమది మా జన్మహక్కని శపథమును జేసి
స్వేచ్ఛకొరకై సాగుచున్నది కర్షకావళి కదనసీమకు
ముందువెనుకలు జూడకను నీవందు పాల్గొన లేచిరమ్మిక ॥సం॥

దేశముకు వెన్నెముక రైతన్నా
మన జాతికంతకు అన్నమిడు దాతలము మనమన్నా
అట్టి రైతే చిట్టచివరకు పట్టెడన్నముకూడ కరువై
రాలిపోతున్నాడు అయయో ఊరకుందువదేల రమ్మిక ॥సం॥

ఎక్కువగ పంటలను పండించి
ధాన్యాదులందరి కందుబాటగు ధరలకందించి
దేశరక్షణ ప్రజల పోషణ దీక్షతో సాగించుకొనుచును
దేశ దాస్య విముక్తికొరకై పాటుబడుటకు లేచిరమ్మిక ॥సం॥

— ముక్కామల నాగభూషణం

(2)

# రైతు బాబూ

( శాల్యూట్ - శాల్యూట్ అనుమాదిరి )

లేవయ్య లేవయ్య ॥రైతుబాబయ్యా॥
లేచి రావాలయ్య ,,
దేశ వెన్నెముకావో ,,
దీక్షతో లేవయ్యా ,,
అన్నార్తులంతాను ,,
ఆకలి మంటల్లో ,,
గాలి యాకులరీతి ,,
రాలిపోతున్నారు ,,
అన్నదాతవంటూ ,,
అంటుంది నిను జగము ,,
అట్టి నీవుండంగా ,,
అన్నానికై ప్రజలు ,,
అమటిస్తుంటేనూ ,,
నిలచి చూస్తుంటావా ,,
కట్టు కట్టు అరకా ,,
పుట్లకు పండించు ,,
కూలన్న నీవూను ,,
కూడి పనిచేస్తుంటే ,,
కూటి కరువేముందీ ,,
కోట్లాది ప్రజకైనా ,,
కూడు సృష్టిస్తారు ,,
బంజర్లు బీళ్ళన్ని ,,
బద్దలుగ దున్నేసి ,,
అధికముగ పండించో ,,

పండిన పంటంతా ॥రైతుబాబయ్యా॥
తిండిదొంగ కమ్మకుమో ..
ఆహార కమిటీకి ..
అమ్మేసి ధాన్యాన్ని ..
దేశ రక్షణకీవు ..
దీక్షతో పనిజేయ ..
పనిజేయ నీవటుల ..
ప్రజల బాధలు తీరు ..
కడుపు నిండిన ప్రజలు ..
కలిసి మెలిసుంటారు ..
ఇట్టి మన ఐక్యతయె ..
ఈ దేశమందూనా ..
జాతీయ ఐక్యతకూ ..
చక్కగా తోడ్పడునూ ..
కాంగ్రెసు వారంతా ..
ఖైదునుం దొస్తారు ..
స్వాతంత్ర్య మొస్తుందీ ..
శాంతి చేకూరూను ..
ఇన్ని బాధ్యతలిపుడు ..
నిన్ను చుట్టున్నాయి ..
మేలుకో మేలుకో ..
మేలుకొని పనిచెయ్యి ..
లేవయ్యా లేవయ్యా ..

— మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

# కరువు

( సుమంగళిలో "బేట్రాయి సామిదేవుడా" అను మాదిరి )

మాయదారి కరువువచ్చెరా - సోదరా మానవులను మాడ్చుచుండెరా
కూటికి మొగమువాచి - కుటుంబాలు యెన్నెన్నో,
కూలిపోవుచున్నాయి; మేలు దలపరయ్యయ్యో! ॥మాయ॥

నిత్యభత్యము నిలువజేయను - మన చేతుల్లో చెల్లని యేగానివున్నదా?
అదనుజూచి వర్తకులు - పదిలముగా సరుకులుకొని,
కొట్లల్లో నిలువజేసి, కొండెక్కి కూర్చుండిరి ॥మాయ॥

సంపాదన సన్నగిల్లినా - చూస్తుండగ సరుకులధర పెరిగిపోయెరా
బట్టకు కరువాయెను, పొట్టకు కరువాయెను;
ఇంతెందుకు సంతలోని సరుకులన్ని ప్రియమాయెను ॥మాయ॥

పేరుకు కంట్రోలుపెట్టి - షాహుకార్లు, హెచ్చుధరల కమ్ముచుండిరి
ప్రభుత్వం పరికించదాయెను - పాటులేక వస్తువడుచునుండిరెందరో
ప్రజాయుద్ధమిదిగదా ఫాసిస్టులను పడగూల్చ
పొట్టమాడుచుండ ప్రజలు పూనుదురా పనికి నేడు ॥మాయ॥

— పీసా లక్ష్మణరావు

# తిండికొఱత

తినుటకే తిండి లేదందోయ్ జనులార
తిండికొఱతను దీర్చరందోయ్ ॥తిను॥

భరతదేశము పాడి పంటలకు యిల్లని
ప్రతిభగాంచెనుగాని, ఫలమేమి చస్తుంద ॥తిను॥

పండినా పంటంత తిండిదొంగలు దాచ
తెగ మాడి ఆకలితొ ఎగిరి చస్తున్నారు ॥తిను॥

కలకత్త చిటగాంగు మలబారు మద్రాసు
రాయలాసీమంత రగులుకున్నది కరువు ॥తిను॥

ప్రేగులెండీ చచ్చె బీదప్రజలందరును
మఱచి కలరాల మ్రగ్గిపోతున్నారు ॥తిను॥

ఆసుపత్రులనిండ అన్నార్తులేనండి
అట్టివారికి మందు అన్నమే, అది లేదు ॥తిను॥

ఐక్యమై మనమంత అధికముగ బండించి
దేశభక్తితోడ తిండి నందించాలి ॥తిను॥

వస్తులుదుపగ భిక్ష భరతదేశపు రక్ష
ఫాసిస్టులకు శిక్ష స్వాతంత్ర్యముకు దీక్ష ॥తిను॥

— వట్టికొండ రామకోటయ్య

# ఆకలి పిలుపు

పంటపండిన, కరువు - పాడిగల్గిన, దప్పి
పాలబడి పోయినదిరా, సోదరా!
భారతావని చూడరా

ప్రక్కరాయలసీమ - పైన బెంగాలులో
కాటకము రగిలిందిరా, సోదరా!
కడుపు కన్నము లేదురా

అన్నాతురుల్ ప్రజలు - అడలిపోయేవేళ
విందారగింతువటరా? సోదరా!
వేడుకలు చాలవటరా?

చేయెత్తి ధర్మాలు - చేయగావలె బాబు;
వేయి రూకలుకాదురా సోదరా!
వేయినూకలు చాలురా

కలిగున్న దాతలో - ధనిక భూస్వాములో
గోతాలు తెరవాలిరా; సోదరా!
పాతరలు తవ్వాలిరా

మా తెల్గువాడనీ - మా భారతీయుడని
దంభోక్తిలో కాదురా; సోదరా!
దాతవై ఆదుకోరా

కదలింపరా గుండె - కరగి ప్రవహింపనీ
మనిషి తెచ్చిన కరువురా, సోదరా!
మానవుడె తీర్చాలిరా

ఆకళ్ళహారతుల - వాకిళ్ళకడనిల్చి
రాకాసి దండుకటరా, సోదరా!
రహదారి తెరుతువటరా?

— కొనకళ్ళ వెంకటరత్నం, బి. ఏ.

# పంట చేను రోద

(పట్టనదిసంద్రాన నావపైనున్నాను — మాదిరి)

పచ్చపచ్చగ పెరిగి
పండి ఒరిగున్నాను
ప్రజకు నన్నందించరావా
నా రైతా
ప్రళయమౌ కరువాపలేవా ? ॥ప॥

కార్తీకమాసాన
కరువంత భరియించి
కళ్ళపూపిరి నిలిపియున్నా
నా రైతా
కష్టజీవుల గావలేవా ? ॥ప॥

కొత్త పంటొస్తేను
కూటికరువేమిటని
కొండంత యాశతోనున్నా
నా రైతా
కూలీల బ్రతికించలేవా ? ॥ప॥

ధరలు పెరిగినవంటూ
ధనిక వర్తకులంత
దరికిరా, ధాన్యమమ్మితివా
నా రైతా
దాతవను బిరుదు చెడిపోదా ! ॥ప॥

నే పండి నాపనిని
నెరవేర్చుకొన్నాను
నీదు కర్తవ్యమును నీవూ
నా రైతా
నిలుపుకొన ముందునకు రావా ! ॥ప॥

— సుంకర సత్యనారాయణ

# క్వారీ పాట

ఓసాయీబన్నయ్య — ఓసాయిబన్నయ్య
నీవూ నేకలిసుండీ — నిలచీ పోరాలన్న ॥ఓ॥

వస్తువూలన్నిటికి — వడ్లకీ గుడ్డకీ
వచ్చిపడ్డది కరువు — ఓసాయీబన్నయ్య ॥ఓ॥

ఓకాపోరన్నయ్యా — ఓకాపోరన్నయ్య
నాతిప్పల్ చూడారా — నాహిందూ అన్నయ్య
పిల్లోళ్ళ పొట్టాకి — పెళ్ళాము బట్టాకి
కరువువచ్చీ చస్తున్నాం — కాపోళ్ళ అన్నయ్య ॥ఓ॥

ఓసాయీబన్నయ్య — ఓసాయీబన్నయ్య
ఒక్కటై జపాన్ని — దొక్క చించేత్తేను
కట్ట గుడ్డొత్తుంది — పొట్టా కింతొస్తుంది
స్వాతంత్ర్య మొస్తుంది — సాగిరా రన్నయ్య ॥ఓ॥

ఓకాపోరన్నయ్య — ఓకాపోరన్నయ్య
నాకు నీకేంతేడా — నా కాపోరన్నయ్య
చెట్టుందా చేనుందా — పొట్టుందీ యిద్దరికి
కమ్యూనిస్టన్నయ్య — కలిసుండ మనెరన్న ॥ఓ॥

— సుంకర సత్యనారాయణ

# పల్నాటి కరువు

కరాళనృత్యం గావిస్తూ యీ - కరువుపిశాచం కమ్మిందోయ్ !
కరువుకు పక్కన తాళంవేస్తూ - కలరాదయ్యం బూనిందోయ్ !
ధరాతలంబున దరిద్రదేవత - గృహప్రవేశం చేసిందోయ్ !
ధిరాన విజయపతాకం దాల్చి - మారణదేవత దూకిందోయ్
పరాకుసేయక పేదల మొరవిని - సాయముచేయగ రారందోయ్ !

ధనికుల్లారా !! లేవందోయ్ !!!

ధరపై లక్ష్మీపుత్రుల గన్నది - దరిద్రనారాయణులేనోయ్ !
మరి తలితండ్రులె మలమలమాడితె - మహీతలంబే శూన్యంబోయ్ !
సిరిసంపత్తులు నీకే స్థిరమని - చిత్తములోపల నెంచకుమోయ్ !
కరుణనుజూపని మానవులంతా - నరులనుమింగే రాక్షసులోయ్ !
నిరాకరింపక కరువు బాధలకు - సాయముఁచేయగ రారందోయ్ !

ధనికుల్లారా !! లేవందోయ్ !!!

తల్లిలేని తనపిల్లలవదలి - తండ్రెక్కడికో వెళ్ళాడోయ్ !
అల్లో లక్ష్మణ ! కరువుబాధతో - తల్లకిందులౌతున్నామోయ్ !
కల్లలుగావివి మాకష్టాలను - కన్నులుతెరచి చూడండోయ్ !
తల్లడమందే పేదల మొరవిని - దయతోవేగమె తర్లండోయ్ !

ధనికుల్లారా !! లేవందోయ్ !!!

కాలేకరువుకు చాలనిగంజి - కలరా ఫలితాన్నిచ్చిందోయ్ !
నిలుచుని ఊరికె చోద్యంచూస్తే - కలరాజాడ్యం నిలుచోదోయ్ !
నేలా, నింగి, సర్వం నిండీ - నిలువున ప్రాణం దీస్తుందోయ్ !
వెలికిదీసి మీ గాదెలగింజలు - బీదలకొరకై కొలవండోయ్ !
ఆలస్యం యేమాత్రం వద్దోయ్ - ఆకలి ప్రళయం హెచ్చిందోయ్ !

ధనికుల్లారా !! లేవందోయ్ !!!

— "అవధాని"

# బెంగాల్ కరువు

(ఏరీతిని మము దయచూచెదవో ఇనవంశోత్తమ రామా : మాదిరి)

ప్రళయమ్ముబుట్టెను వంగదేశమున భయము గొలుపనో రైతా
భరతఖండమున పేరువహించిన పంటభూములివి రైతా॥
గంగ బ్రహ్మపుత్రల నీటితోనట కనకముపండును రైతా
అట్టి ప్రాంతమున కరువుజ్వాలలు అలముకొన్నవో రైతా॥
బీదలెట్లు జీవింతురు? వందట బియ్యపుబస్తా రైతా
ఆలిపిల్లలతో కలకత్తాలో అన్నమన్నమని రైతా॥
బీదలు చచ్చుచునుండిరి పట్టెడు సాదము దొరకక రైతా
పగలువత్తిడని చౌకడిపోకడ పాపము రాత్రియె రైతా॥
బారులు దీరిచి పందిరి బీదలు బజారులందే రైతా
ఆ గతి పడిగాపులు పడియుండిన అన్నార్తులలో రైతా॥
తెల్లవారి మరి లేవకెందరో చెల్లిరచ్చటే రైతా
సోషవచ్చిపడియున్న తల్లిపై సుతుడుజేరి ఓ రైతా॥
పాలమ్మా యని ఘోరున నేడ్చుచు బాధించును ఓ రైతా
కుక్కతో బాలుడు యెంగిలాకుకై కొట్లాడగనో రైతా॥
కుక్కపైనబడి కరువగనాతం డక్కడెకూలెను రైతా
పల్లెలలోపల బ్రతుకు కష్టమై ప్రజలనేకులో రైతా॥
కలకత్తాలో కూలిజేసికొన కదిలిపోయి ఓ రైతా
ఆలిపిల్లలతో జచ్చుచునుండిరి అందరచ్చటే రైతా॥
పైగా నెత్తిన బాంబులవర్షము ఫాసిస్టులవో రైతా
నీ సోదరులిటు జచ్చుచుండగా నీవు జూతువా రైతా॥
నీ ఖర్చులకై పోగా మిగిలిన నిలవధాన్యమో రైతా
ఆపదలోనున్నట్టి దీనులకు అందచేయవా రైతా॥
పొళ్ళు బీళ్ళు దున్నేసి ధాన్యమును పుట్లకొలది ఓ రైతా
పండించుము రాత్రి బగలనక పంటలధికముగ రైతా॥

— సుంకర సత్యనారాయణ

# బెంగాలు రైతు

ఓ బెంగాలూ - పేదరైతా!
కరవుతోచే - కూలిపోతీవా?
(పరువు జెడితీవా)

పొలము పుట్టా - విడిచిపెట్టీ
కానినన్నీ - గంజినీళ్ళకు
కానిదేశం - కదలిపోతీవా? ॥ఓ॥

కలకత్త - పట్టణంలో
కాలికొందీ - తిరిగి తిరిగీ
నేలపైనా - వ్రాలిపోతీవా? ॥ఓ॥

హెచ్చుధరలూ - వచ్చినయ్యని
ఇచ్చకాలకు - మోసపోయీ
పంట దొంగల - పరముజేస్తీవా? ॥ఓ॥

ఇంట గింజా - ఉంచుకోకా
పంటనంతా - అమ్మివేసీ
గింజకోసం - వాచిపోతీవా? ॥ఓ॥

అన్నమో - అన్నమో యని
అవటిల్లిపోవ - పిల్లలు
చూడలేకా - మ్రోడువైతీవా? ॥ఓ॥

ప్రాణాలు నిల్పుకొంటకూ
మానాలు అమ్మివేయా
స్త్రీల బ్రతుకూ - పాలిటకు
కాలమెంతా - కలుషమయ్యేనురా ॥ఓ॥

గ్రుక్కెడయినా - గంజిదొరకక
స్రుక్కిపోయిన - నీదు దేహం
నక్కలాకూ - విందు జేసేనా ||ఓ||

అంటురోగాల్లోన - జనులూ
ఆహుతవ్వగ - వేనవేలూ
కోసినూర్చే - వారులేకా
పంటకొంతా - నాశమయ్యేనా ||ఓ||

పైరుపచ్చల - పల్లెటూళ్ళను
భాగ్యనిధులౌ - పట్టణాలను
స్వార్థపరులౌ - వర్తకూలు
వల్లకాళ్ళుగ - మార్చివేసేరా ||ఓ||

కొత్తపంటా - కోసమై వా
రెత్తులేయా - సాగిరపుడే
చిత్తుజేసీ - వారి జిత్తుల
చేర్చవోయీ - దేశమొద్దూకు ||ఓ||

దేవుడే కరువుకు - బాధ్యుడంటూ
అఘోరించే - అమెరి దొరకూ
తగిన జవాబీయలేవా? ||ఓ||

— కొత్తపల్లి రంగారావు

# వంగరాష్ట్రం

## ( కోలాటం పాట )

జై జై జై జై స్వతంత్రభారత్
జై జై జైయని లేలెండి
దేశభక్తులు రారండి—

వంగరాష్ట్రమున ప్రజల తలలపై
ఇనుపగజ్జెల - పెద్దమ్మ,
ధణధింధిణధిణ యని త్రొక్కేను—

కరువు మేఘములు తెరలుతెరలుగా
బెంగాల్ నింగిని నిండేను,
ప్రజలకడుపులే మండేను—

కూటికి లేక గుడ్డకులేక
అల్లాడాకులు మేశారు
పరువుకు దిక్కులు చూశారు

రొమ్ముమంటుకొని క్రుమ్ములాడి పసి
పాపలు పాలకు నేడ్చారు
తల్లులు కన్నీరోడ్చారు—

వెంటనంటు ఎదబిడ్డలు అంటుకు
పోయిన డొక్కలు చూపారు
తల్లుల గుండెలు కదిపారు—

కంటికి కడవగ కారేకన్నీ
రంతట నింతట పారింది
ఆంధ్రదేశమును చేరింది—

ఏ శ్రీమంతుని ఎంగిలియాకో
బజారులోనే పడ్డాది
మెతుకొశ టందగ పడ్డాది—

మాడే కడుపులా మండే అగ్నితో
కుక్క ఒక్కటటు వచ్చింది
పోడినాల్క దడుపజొచ్చింది—

ఎన్నాళ్ళాయెనో ఎంగిలిపడి, యొక
బాలుడందుకే చేరాడు
తినుటకు నువ్విళ్లూరాడు—

మెతుకు మెతుకుగా గతుకుటకొరకే
కుక్కా బాలుడు కూడారు
పోటీపడి పోరాడారు—

భౌ భౌ భౌ అని భయంకరంగా
కుక్కే కోరలు తెరచింది
బాలుని పట్టుక కరచింది—

మండుటాకలితో గుండెధైర్యము
ఇమ్మడి, ముమ్మడిగావాడు
తెగించి పోరగసాగాడు—

ఆకలి తెచ్చిన అతిధైర్యంతో
మీదకు కుక్క దూకింది
నెత్తురు కండలు నాకింది—

ఎంగిలాకులో యింత మెతుకుకై
బిడ్డడు కన్నులు మూశాడు
బాధ్యత మనపై వేశాడు—

వంగరాష్ట్రమున వెంగుచెంగునా
కరువు రాక్షసి దూకంగా
ఆకలిమంటలు సోకంగా—

చౌకదుకాణపు చౌకుల్లోన
ప్రజలు గుంపులుగ కూడారు
మండుటెండలకు మాడారు—

ఎండకు మాడీ వానకు తడిసీ
రేలు పగళ్ళును గడిపారు
కూటికి దొరకక కునికారు—

పగలూరాతిరి పలు పాటులుపడీ
దమ్మిడి సంపాదిస్తేను
ఒట్టొక గింజవస్తేనూ—

ఆలు మగళ్లూ బిడ్డా పాపలు
ఎముకలు మిగిలీ వున్నారు
కరువు క్రమ్ముకొని వున్నారు—

భార్య తిండికి భర్త ఓర్చదు
భర్త తిండికి భార్య ఓర్చదు
పిల్లతిండికి తల్లి ఓర్చదు
తల్లి తిండికి పిల్ల ఓర్చదు

రక్తబంధములు రాళ్ళపాలుగా
దరిద్రదేవత చేసింది
ప్రేమ అనేదే మాసింది—

భార్యను వదలి భర్తపోవును
పిల్లనువదలి తల్లిపోవును
తమతమ పొట్టలె తమకు బరువుగా
ఈడుపుకాళ్ళతొ నెట్టారు
ఏడుపుమొగములు పెట్టారు—

పూటకూటికై పొట్టపట్టుకొని
స్త్రీలు వీధులను పడ్డారు
మానమమ్ముకొని చెడ్డారు—

బైటనుండి జాపాను పిశాచం
మనపై దాడికివస్తోంది
మన ప్రజ మాడుతు చస్తోంది—

దేశద్రోహి బోసు సయాము
బియ్యం తెస్తానంటాడు
టోజోవస్తాడంటాడు—

కల్లబొల్లి వేకబురులొ చెప్పి
మోసం చేయగ జూస్తాడు
ప్రజలకు ఉచ్చులు వోస్తాడు—

కరువు పిశాచపు గజ్జెలమ్రోత
శత్రురేడియో మార్మోత
మనప్రజలిట్టుల వలపోత
దేశరక్షణము చేసికొనంగా
ఎంతకష్టమో చూడండి
ఏది మార్గమో చూడండి—

వంగరాష్ట్రమే భారతభూమికి
రక్షణమందిరమందోయ్
శిక్షణమందిరమందోయ్—

పవిత్ర గంగా ప్రవాహ పూతము
వంగరాష్ట్రమే నందోయ్
మన పుణ్యతీర్థమందోయ్
వంగసోదరుల బలశౌర్యాలే
తెగించి ముందుకు వస్తాయి
దేశరక్షణను చేస్తాయి—

కలిగినమట్టుకు కాసోవీసమొ
వారికి సాయం పంపాలి,
కరువు రాక్షసిని చంపాలి—

కూటికి కుక్కతొ కాటులాడిన
బిడ్డనిపాటులు చూడండి
వారికి సాయంచేయండి—

దరిద్రబాధకు శరీమమ్మిన
మన చెల్లెండ్రను చూడండి,
ఓపినసాయం చేయండి—

వీధులవెంబడి వెర్రి దుమ్ములో
పొరలు శవాలను చూడండి
తోచిన సాయం చేయండి—

పైపై వచ్చే జపాన్ నీచుల
ఉరవడి యించుక అరయండి
త్వరపడి సాయంచేయండి—

వంగసోదరుల బలశౌర్యాలే
తెగించి ముందుకు వస్తాయి,
దేశరక్షణను చేస్తాయి—

జై జై జై జై స్వతంత్రభారత్
జై జై జై యని లేవండి
దేశరక్షణకు సాగండి—

దొరికిన జాపాన్ శిరసు నెత్తురులు
గుండెల నిండుగ గ్రోలండి,
జయనినాదముల దేలండి—

వీర శివాజీ ఝాన్సీ లక్ష్మి
విజయగాధలే తలపండి.
దేశగౌరవం నిలపండి—

— విద్వాన్ ప్రయాగ కోదండరామశాస్త్రి

# వెళ్లిపోదామా....

వెళ్ళిపోదామా ?
మామా
వెళ్ళిపోదమ పట్నవాసపు
కుళ్ళు వీధులలోబడి ॥వె॥

ఈన మోపైవున్న పైరులు
ఏటిమునకల పాలుజేసి,
కొంపగోడీ విడిచి, పట్టెడు
కూటికై వూరేగవలెరా ॥వె॥

పంటతల్లిని ఏ రహస్యపు
పాతరల ఖైదుంచినారో ;
గుండెలోన ఎడారి మండే
గోదెరుంగ దికేమి దిక్కో ॥వె॥

ఒడలుపెంచిన గడ్డమీదే
వారిగిపొయ్యే రాతలేదో;
ఊరుగానీ వూరులో చితి
పేర్చుకొమ్మని నొసటివ్రాలో: ॥వె॥

రాజనపు రతనాలభూమిని
ఏమనీ సెలవడిగి పోదము ?
ఏకతల మన్నయిన తనలో
ఇమిడిపోవక తీరదనరా ॥వె॥

గడిచిపోయినవా సువాసన
ఘడియలిక మన బ్రతుకుతెరువున ?
కాలమొక్క మహాగ్నికుండము
కాచుకొన్నది ముందు మనకై ॥వె॥

— కొనకళ్ళ వెంకటరత్నం

# అన్నా చెల్లెలు

("బ్రహ్మపట్నం పోదమంటే పీకటేమిర అన్నయా" అను మాదిరి)

ఎంతదిరిగిన యేమిదొరకదు ఖర్మమేమిర అన్నయా
ఖర్మకాదిది కరువువచ్చెను తెలిసికొనవే చెల్లెలా

పంటవున్నా కరువువచ్చిన హేతువేమిర అన్నయా
పంటనంతా తిండిదొంగలు దాచివైచిరి చెల్లెలా
తిండిదొంగల బట్టెశక్తి లేకపోయెనా అన్నయా
ప్రజల అండలేని ప్రభువుల శక్తియెట్టిది చెల్లెలా
ప్రభువుబూనితె ప్రజల అండతో నేమిపనిరా అన్నయా
పూని విఫలత పొందినాది తెలిసికొనవే చెల్లెలా
ఏమిచేస్తే విఫలమైనది యెరుగజెప్పర అన్నయా
ధరలకంట్రోల్ పెట్టి తానే మించికొన్నది చెల్లెలా

మించికొంటే ముంచుకొచ్చిన మోసమేమిర అన్నయా
మార్కెట్టువిడచీ సరుకు అంతా మాయమైనది చెల్లెలా
చౌకఅంగడి పెట్టిసరుకూ అందజేయద అన్నయా
సరుకు శూన్యపు చౌక అంగడి ఫార్సుగాదా చెల్లెలా

తిండికరువు తీర్చేమార్గం వేరెలేదా అన్నయా
ప్రజల ఐక్యతవల్ల కరువు తీర్చవచ్చునె చెల్లెలా

ఐక్యతుంటె తీర్చుటెట్లో తెలియజెప్పర అన్నయా
ఉన్నధాన్యం ఉమ్మడీగ ఉంచుకోవలె చెల్లెలా

తక్కువైతే భర్తిచేసే మార్గమేమిర అన్నయా
హెచ్చువున్న చోటునుండి తెచ్చుకోవలె చెల్లెలా

ఎంతధాన్యము పట్టునాదీ తెలియుటెట్లుర అన్నయా
ఇండ్లబట్టీ లెక్కతీసే వారలెవ్వరు అన్నయా
లెక్కతీసే బాధ్యతంతా వలంటీర్లదె చెల్లెలా

పిల్లిమెడలో గంటకట్టే పెద్దలెవ్వరు అన్నయా
అంతకలసి ఆహారకమిటీ లెన్నుకోవలె చెల్లెలా

ముందు బ్రతికే మార్గమేమో తెలియజెప్పర అన్నయా
హెచ్చుపంటకు పెచ్చుసాగూ చేయవలెనే చెల్లెలా

హెచ్చుపంటకు భూమి యెక్కడ వున్నదీరా అన్నయా
బంజరంతా దున్ని పైరూ వేయవచ్చునె చెల్లెలా

ఐతె రైతూ బాబులాకు యేమిజెప్పుదు వన్నయా
ఎరువువేసి పంటనెక్కువ చేయమందునె చెల్లెలా

పొలములేని కూలివారూ బ్రతుకుటెట్లుర అన్నయా
బంజరంతా సాగుచేసీ బ్రతుకవచ్చునె చెల్లెలా

బంజరంతా ప్రభువులోరూ బీదవారికిత్తురా
రైతుకూలీ లేకమైతే బంజరివ్వక పోదురా

కులము మతమూ భేదములతో ఐక్యతెట్లుర అన్నయా
కాలెపొట్టకు కులము మతము కానరావే చెల్లెలా

యిన్ని జేయుట యెందుకొచ్చిన బెదదరోరీ అన్నయా
చేయకుంటే శతృవశమూ దేశమౌగద చెల్లెలా

మనల బ్రమింగే శతృవెవ్వరొ చెప్పరోరీ అన్నయా
సరిహద్దులో జాపానువారూ పొంచియుండిరె చెల్లెలా

శతృవులనూ సిపాయివారూ చావగొట్టర అన్నయా
ఆహార కరువుతొ అలజడొస్తే పతనమేగతి చెల్లెలా

ఉ భ యు లు

రండిపోదము మార్గమిదియె రైతుకూలీ బాబులూ
తిండికరువును తీర్చి మనమూ హాయిగుందము రండయా

వి. శ్రీ కృష్ణ

# కర్తవ్యము

రాబోవు పంటలకై రగిలిందిరా కరువు।
వస్తున్న పేదలకు పగిలిందిరా గుండె ॥

కనరాని పగవారు యీ తిండిదొంగలే
ప్రజల ప్రాణాలతో జూదమాడారురా ॥

తెలిచాటు ఫాసిస్టు దెయ్యాల రాకలకు
మంచి రహదారి కల్పించుచున్నారురా ॥

క్షామదేవత నేడు తాండవించినచోటు
దేశరక్షణశక్తికొక వెన్నెముకపోటు ॥

సర్వపక్షాలైక్య సంఘటితమౌనాడు
జాతిస్వాతంత్ర్యమ్ము సాధించుకోగలము ॥

హెచ్చులాభాలకై ఎగనియమ్మితిమా
పండి నిండినపంట తిండిదొంగలపాలు ॥

తోటిదేశీయుల తులలేని ప్రాణాలు
మృత్యుదేవత నీడ నిత్యనైవేద్యాలు ॥

అన్నదాతవునైన ఓ రైతుబాబా
నీతోటివారలే చిటగాంగుపేదలు।

దేశభక్తులనేటి కర్తవ్యమల్లదే
కడుపుమాడినవారి కన్నీరు తుడుచుటే ॥

అన్నిటికి తోడుగా అంటువ్యాధులురేగి
వేయినాలికలుచాచి కబళించుతున్నాయి।

తోటిప్రాణాలకై కోటిచేతులుసాచి
నీజాతి ధర్మమ్ము నిలుపుకోవయ్య ॥

— నార్ల చిరంజీవి

# తుమ్మెదపాట

(పాండవులవారే తుమ్మెదా, పంచ పాండవులవారే తుమ్మెదా : వరుస)

పాడవేపాడవే తుమ్మెదా - మంచి పాటలెన్నోపాడు తుమ్మెదా
జర్మనీ జాపాను తుమ్మెదా - గొప్ప జనహంతకులు వారు తుమ్మెదా
పడమరా జర్మనీ తుమ్మెదా - పడెను తూర్పునా జాపాను తుమ్మెదా
పసిపిల్లలనుబట్టి తుమ్మెదా - వారు పరపరా గోశారె తుమ్మెదా
స్త్రీల హింసించారె తుమ్మెదా - పంటచేలు తగలెట్టారె తుమ్మెదా
బర్మాను దిగమ్రింగి తుమ్మెదా - నీచపానిస్టు జాపాను తుమ్మెదా
భరత ఖండముపైన తుమ్మెదా - వేగ పడజూచుచున్నదే తుమ్మెదా
కలకత్త పట్నాన్ని తుమ్మెదా - వారు కాల్చారె బాంబులతో తుమ్మెదా
చిట్టగాంగుపైనా తుమ్మెదా - చాల చిచ్చుబాంబులువేసె తుమ్మెదా
విశాఖపట్నాన తుమ్మెదా - వారు విసిరారె బాంబులూ తుమ్మెదా
ఈ సమయమందునా తుమ్మెదా - వేగ హిందువులు ముస్లిములు తుమ్మెదా
చెయికలిపి శత్రువును తుమ్మెదా - తన్ని చెండిపారెయ్యాలి తుమ్మెదా
పండించు పండించు తుమ్మెదా - మంచి పంటలను పండించు తుమ్మెదా
దేశానచూడవే తుమ్మెదా - గొప్ప తిండి కరువొచ్చింది తుమ్మెదా
కష్టించి మనమంత తుమ్మెదా - నేటి కరువాపుజెయ్యాలి తుమ్మెదా
సోదరులు చస్తుంటె తుమ్మెదా - నీవు చూస్తు కూర్చుంటావ తుమ్మెదా
రత్నగర్భమ్మ యిది తుమ్మెదా - యిచట రత్నాలు పండునే తుమ్మెదా
కలిసి మనమందరము తుమ్మెదా - యిపుడు కరువాపుజెయ్యాలె తుమ్మెదా
కాంగ్రెస్సువారినీ తుమ్మెదా - వేగ ఖైదు విడిపించాలె తుమ్మెదా
ఈ తరుణమందునా తుమ్మెదా - యింక యితర మార్గములేదె తుమ్మెదా
ఐక్యతే ఐక్యతే తుమ్మెదా - వీటి అన్నిటికి మూలమే తుమ్మెదా
పాడవే ఒకపాట తుమ్మెదా - యిచటి ప్రజలు కలవాలంచు తుమ్మెదా॥

— సుంకర సత్యనారాయణ

# టో జో గా

## ( కోలాటంపాట )

భరతభూమిని నీదు పాదదాసిగజేసి
పాలింపనెంచితివా - టోజోగా - పాలింప నెంచితివా॥

మాతృభూమిని నీకు - మహాదాన మివ్వంగ
మాతృద్రోహులంగామురా - టోజోగా - మాతృద్రోహుల గామురా॥

గాంధి, జిన్నా, జోషి - కన్నతల్లినిగావ
కార్యక్రమంబివ్వగా - టోజోగా - కార్యక్రమం బివ్వగా॥

కాంగ్రెసు లీగును - కమ్యూనిస్టులు కలిసి
కాల్చక నినువిడుతురా - టోజోగా - కాల్చక నినువిడుతురా॥

ఫాసిస్టు తొత్తయిన - బోసుమాటల నమ్మి
ఆశలుబడుచుంటివా - టోజోగా - ఆశలు పడుచుంటివా॥

బానిసపీడను - బాయజూచూ ప్రజల
బాధింపనెంచితివా - టోజోగా - బాధింప నెంచితివా॥

కోట్లచేతులు గలిపి - గొంతుగోసీ నిన్ను
గోరికట్టక విడుతుమా - టోజోగా - గోరికట్టక విడుతుమా॥

స్వాతంత్ర్యప్రియులైన - కూలీ రైతులు నిన్ను
ఖూనీచేయక విడుతురా - టోజోగా - ఖూనీచేయక విడుతురా॥

— లోకం వెంకటేశ్వరరావు

# మరణ ఘోష

అమెరీ లిన్లిత్గోల అమానుష ప్రతిష్టంభనం
మా ప్రాణాలతో ఆడిన చెలగాటం
ప్రపంచ ప్రజకొక కఠోర సాక్ష్యం
బంగరు పంటల భారతభువిలో
పొట్టకు పట్టెడు మెతుకే కరువై
మరణించాం। మేం మరణించాం।

అహో। మా మరణదూతలే, తిండి దొంగలు
శిశువుల రోదనలే జయభేరీగా
భార్యల మానాలే తమ పణముగ
మా ప్రాణాలే తమ అధికలాభముగ
దొంగ (ఉష్-నడి) బజారులో దోచిన ఫలితం
మరణించాం। మేం మరణించాం।

జానాబ్ జిన్నా। జానాబ్ జిన్నా।
కాంగ్రెసు లీగుల కలయికకోసం
కావించిన కృషియేమోకాని।
కలకత్తాలో కాలిబాటలపై
హిందువులం - ముస్లింలం - ఒకపై - ।
మరణించాం। మేం మరణించాం।

దేశభక్తులారా। బహుపరాక్।
జాతి నాయకుల జైలు విముక్తికి
జాతుల మధ్యను సఖ్యతగూర్చి
తిండికరువును తీర్చుటకొరకై
కృషిచేయని మీ నిస్పృహ ఫలితం
మరణించాం। మేం మరణించాం।

దేశభక్తులను వెన్నున పొడిచీ
జావ్ బాంబులతో స్వేచ్ఛను దెచ్చే
పంచమాంగదళ పాపుల చర్యల
కాంగ్రెసుపేరిట చేసే మోసం!
ఘోరం! దేశద్రోహం! చాటుటకై
మరణించాం! మేం మరణించాం!

మాతృభూమి రక్షణ పోరాటంలో
వీరులవలె, మరణించే భాగ్యం
లేదని, ఆశాహృదితో, వ్యధతో
దేశభక్తులను మేలుకొల్పుటకు -
ఆకలి! ఆకలి! అని ఘోషిస్తూ
మరణించాం, మేం మరణించాం!

— పట్టాభి రామారావు

# కాంగ్రెసు - లీగులు కలవాలి

కాంగెగ్రిస్సు - లీగులూ కలసిపోవాలి
కలతలన్నీమరచి కూడిపోవాలి
జాతీయపాలనా స్థాపించగాను
దేశదుస్థితివేగ తొలగింపగాను ॥కాం॥
బెంగాలుప్రజలంత బువలేకచస్తుంటె
మలబారుదేశాన మహామారిచెలరేగ
బీహారుభాయీల బాధలూమితిమీర
రాయలాసీమలో రక్షణేలేకున్న
ఓఢ్రరాష్ట్రంకూడ ఒత్తిడికిలోనవ్వ
పరపాలకులునుంత పరవచేయకనుండిరి ॥కాం॥
భేదాలచేమనము బలముకోల్పోవ
పాలకులుపెత్తనం బిడువకున్నారు
క్షామంబుచేప్రజలు చావుబ్రతుకులనుండ
జాపానుదండెత్త సంసిద్ధమగుచుండె ॥కాం॥
కాంగ్రెస్సునాయకులు కారలోఉంటేను
ముస్లిములీగర్ల మౌనమేచూచి
ప్రజలసేవకులంచు పంచమదళమిపుడు
జాపానుదాడికీ జాతినేబలిచేయ
కలతలేపెంచేను కల్లోలమొనరించె
కనుమూసికూర్చుండ గాదండియిపుడు ॥కాం॥
కాంగ్రెస్సు - లీగులూ కలసిఒత్తిడిచేస్తె
జాతీయపాలనా సత్వరమెవచ్చు
అప్పుడెమనకరువు కంతంబుగలుగు
ప్రజలుపాలనకెంతో బలమీయగలరు
దేశరక్షణపనులు తేజరిల్లును
గజదొంగటోజోకు గుండెదిగజారు ॥కాం॥
దేశానికీముప్పు తప్పింపగానూ
స్వారాజ్యరథమూను సాగింపగానూ
కాంగ్రెస్సు - లీగులూ కలసితీరాలి
కలతలన్నీవిడచి కూడితీరాలి ॥కాం॥

— క్రాంతికుమార్

# సైనికునకు ప్రజల వీడ్కోలు

వెడలి రావోయి! వీరసైనికుడా!
విజయముతేవోయ్! వేగమెరావోయీ!
మనపేద కూలీల - మనసు నెరుగుదుగా!
మన రైతుబాబులను - మరచిపోవవుగా!
నీతల్లి దండ్రులకు - నీ పిల్లజెల్లలకు
నీవు లేనీ లోటు - మేము రానీము ॥వెడలి॥

పిల్లల పిడుగుర - పిల్లపాపలపాల!
చిచ్చు బాంబులవాడు - స్త్రీ వృద్ధులందరికి;
ఆస్తిపాస్తుల నన్ని - విధ్వస్త మొనరించు
శత్రువును ద్వేషించి - చావుదెబ్బను గొట్ట ॥వెడలి॥

వెనుకంజ వేసేవు! - ముందు తలక్రిందైన
మనజాతిమర్యాద - మట్టి గలిపేవు! ॥వెడలి॥

నీవెనుక మేమంత - నిలిచియుంటామోయ్
నీకేల భయమింక - నిలిచిపోరాడు! ॥వెడలి॥

కంచుకోటను గట్టి - కాచియుంటాము
కించేల శత్రువుల - చించిచెండాడు! ॥వెడలి॥

ఇబ్బడిగ పంటలను - ఎన్నో పండిస్తాము
సరుకు లింకెక్కువగ - సప్లైలు జేస్తాము
ఆయుధాలకు తరుగు - అసలు రానీము
నీకేది లోటింక - దూకి ధైర్యముతో ॥వెడలి॥

తుక్కుధూళిగ నిపుడె - ముక్కడీశత్రువుల
ఉక్కు ధైర్యముతోడ - ఉక్కడించగనీవు ॥వెడలి॥

ప్రజలలో భేదాల - నాధారముగ వాడు
అన్నిదేశాలనూ - అవలీల మ్రింగేడు
మనప్రజల సైనికుల - మధ్యభేదాలకై
సరిహద్దులో పొంచి - శత్రువున్నాడు ॥వెడలి॥

ఒంటరిగ మనమిపుడు - ఉంటిమనుకొంటివా ?
ప్రపంచ ప్రజలంత - మన పక్షమున్నారు ॥వెడలి॥

అమెరికన్ సైన్యాలు - ఆంగ్లేయసైన్యాలు
అసరాగున్నారు - ఆసతో పోరాడు ॥వెడలి॥

ఒకసారె మనమంత ఒడ్డుకెడదాము
అందరము స్వాతంత్ర్య - మనుభవిద్దాము
ఉమ్మడి శత్రువు - నురుమాడి రారమ్మ ॥వెడలి॥

— కొత్తపల్లి రంగారావు

# సాయం

వీరభారతకుమారా, సేనకు
వెంటనె సాయము పదరా ॥వీర॥

యుద్ధోన్ముఖులై హద్దులగాచెడి
యిరువదిలక్షల యీ మన సేనల
రక్షణ మనకేరా ॥వీర॥

దేశరక్షణా దీక్షవ్రతులై
తుపాకులన్నియు, జపానుపై పుకు
త్రిప్పిరి చూడుమురా ॥వీర॥

వారిపిల్లలను వారితల్లులను
కష్టసమయమున కాపాడుటవీ
కనీసధర్మమురా ॥వీర॥

మనప్రాణంబును మనమానంబును
తనశిరమొసగుచు అనయముబ్రోచెడి
ఘనులని తెలియుమురా ॥వీర॥

పంటలధికముగ పండించుచు మన
ప్రజలను, సేనల - బ్రతికించెడి యీ
పని కర్షకునిదిరా ॥వీర॥

మరతుపాకులను బిరబిరజేసి
శత్రుమూకలను చంపేటందుకు
పంపుట కార్మికులపనిరా ॥వీర॥

శిశువులచంపే పశువులనరికే
జపానురక్కసి అపాయమన్నది
అందరికున్నదిరా ॥వీర॥

ఆగేసేనకు - యేగేసేనకు
తగినసాయమిది త్వరగాముప్పును
దాటుటమంచిదిరా ॥వీర॥

— సుంకర సత్యనారాయణ

# ఫకీరులు

| | |
|---|---|
| పాడి పంటలు పల్లాగుండాలి | అల్లాకెనాం |
| తల్లి పిల్లలు సల్లాగుండాలి | ॥అ॥ |
| తండ్రి కొడుకుల్ పల్లాగుండాలి | ॥అ॥ |
| అన్ని జాతుల ప్రజల్ | ॥అ॥ |
| వార్కి ఏకం కావాలండి | ॥అ॥ |
| హిందూ ముస్లింలంతా | ॥అ॥ |
| వారు ఏకం కావాలండి | ॥అ॥ |
| అన్ని మతములవారు | ॥అ॥ |
| వారు ఐక్యముగా వుండాలి | ॥అ॥ |
| జాతీయ నాయకుల్ | ॥అ॥ |
| వార్కి విడుదల్ చెయ్యాలండి | ॥అ॥ |
| తిండిలేకను ప్రజలు | ॥అ॥ |
| వారు మాడిపోతున్నారు | ॥అ॥ |
| పేట పేటలోను | ॥అ॥ |
| ఆహార కమిటీలు పెట్టాలి | ॥అ॥ |
| తిండి దొంగలికి | ॥అ॥ |
| వార్కి పట్టి బైటికిలాగాలి | ॥అ॥ |
| కమ్యూనిస్టులమాట | ॥అ॥ |
| మాట కాయమైతీరాలి | ॥అ॥ |
| బడా నాయకులంతా | ॥అ॥ |
| భాయి భాయి అని తిరగాలి | ॥అ॥ |
| చోట నాయకులంతా | ॥అ॥ |
| చెయ్యి చెయ్యి కల్పాలి | ॥అ॥ |

జాతీయ ప్రభుత్వం ॥అ॥

మన్కి జల్దీగా రావాలి ॥అ॥

నాజీ జర్మనువాళ్కి ॥అ॥

వాడ్కి నాశనం చెయ్యాలండి ॥అ॥

జాపాను వాళ్ళను ॥అ॥

కైమా కైమా చెయ్యాలండి ॥అ॥

ఫ్యాసిస్టు వాళ్ళను ॥అ॥

వాళ్కి పాతిపెట్టాలండి ॥అ॥

పంచమాంగదళము ॥అ॥

దాన్కి పూడ్చిపెట్టాలి ॥అ॥

సామ్రాజ్యవాదుల్ని - చల్లగా - ॥అ॥

వాళ్కి సాగనంపాలండి ॥అ॥

# హిట్లరు పరాభవము

## (వీధిభాగవతము)

## ప్రార్ధన

కీర్తన॥ అంబా పరాకు, దేవీపరాకు
మమ్మేలు మా భారతాంబాపరాకు
జెండాకట్టిమేము ఢంకావాయించేము
జయధ్వాన మంబాకు, జేజేలుగొట్టేము॥
హిట్లరంతముకు - అంబ
టోజో సాంతముకు - అంబ
స్వతంత్ర శపథమును - అంబ
సత్వరముగజేతుమె - అంబ - భారతాంబ॥

వ. అని యీ ప్రకారంబున - ప్రపంచ యుద్ధంబున, తృతీయ ఘట్టంబునకు కథాక్రమంబెట్టిదనిన—

(సేవకుని ప్రవేశం)

సేవ :—రంగళునక, సంగర భల్లూకంబులవోలె భయానక దృశ్యంబుతో హయాము జేయు నాజీ సేనలారా! మంత్రిపుంగవులారా! జర్మన్ పౌరులారా! చండ ప్రచండయుద్ధంలో మధ్యాహ్నమార్తాండునికైవడి విజృంభించి, విజయలక్ష్మిని వరించుచున్న శూరాధిశూరుండును, వీరాధివీరుండునగు హిట్లరునేత సపరివారం బుగా, అల్లదె వచ్చుచున్నారని తెల్ప వచ్చియున్నాడ. మీరందరూ జాగరూకులై యుండకోరుచున్నాడ—

(హిట్లరు, ముసోలినీ, టోజో ప్రవేశం)

కీర్తన॥ వెడలె హిట్లరు సభకూ
సూటు బూటు సీటులను జూపుచు
జర్మన్ ఫిటింగు, హాఫ్‌కటింగుతో ॥వె॥

సేవ :—ప్రపంచాధిపత్యాభిలాషీ! నాజీరాజ్య నిర్మాతా! హిట్లరునేతా! బహుపరాక్!

హిట్లరు : – సెహబాష్.

ఓరీ సేవకా ! మంత్రిపుంగవులగు రిబ్బన్‌ట్రాఫ్, గోరింగ్, గోబెల్సు, హిమ్లరు లున్నూ, సేనానాయకులు, నావికాధిపతులు, విమానాధిపతులు, నాజీనాయకులు ఎల్లరూ యీ సభారంగమునకు వచ్చియున్నవారటరా !

సేవ ;— అందరూ విచ్చేసి ఉచితాసనంబులు అలంకరించి యున్నవారు ప్రభూ !

(నిష్క్రమించును)

(హిట్లరు పరివారంబుతో వెడలి)

కీర్తన॥ సిద్ధమయ్యె - హిట్లరూ - యుద్ధమునకు
ముందువెనుక ముస్సోలిని టోజో
కుడియెడమల గోరింగు గోబెల్సులు
బలగముతోడను కొలువుకూటముకు ॥వెడలె॥
యెదురుగలడె యెవ్వడైన యిలలో ॥నాకెదురు॥
పరిపాలించెద ప్రపంచమంతని ॥సిద్ధమయ్యె॥

వ. అని హిట్లరు ఏమని ప్రగల్భములు పల్కుచున్నాడయా అంటే,

సీ॥ మొదట జకోస్లావు, మదము నిర్మూలించి
మరియు పోలండును, మసియొనర్చి
నార్వేను షడియలో, నాశనం బొనరించి
పిదప డెన్మార్కును, పీచమణచి
అటసాగి హాలండు, నంతంబు గావించి
బెల్జియంబునుబట్టి, పేల్చివేసి
ఫ్రాన్సుదేశపు గర్వ, భంగంబుగావించి
ఇంగ్లండు ధైర్య, మింకింపజేసి
మంటబాంబుల గురిపించి, మన్నుజేసి
వేనవేల ఫిరంగుల, ప్రేల్చివైచి
టకటకా చెటపటాయని, టాంకులెన్నొ
బంపి శత్రుల నరికితి, రంపకోత.

ముస్సోలినీ :—

వ. అది అటుండనీయ్ సోదరా ! నీ అండజూచుకొని ఫ్రాన్సువెన్నున పొడిచితిని. నీ అండజూచుకొనే మన చిట్టితమ్ముడు టోజో పసిఫిక్‌లో యుద్ధం ప్రారంభించె. అయినా రష్యాలో నీయుద్ధానికి అంతూపంతులేదయ్యె ఇంక—

కీ ర్తన॥ ఎటుల నే బ్రతుకుదును ఇక హిట్లరయ్యో
మొండి ధైర్యముచేసి నీయందనుంటిని యిన్నినాళ్ళు
బాంబుదెబ్బకు గుండెచెదరి బండగా మారిపోవ ॥ఎ॥

గంటగడచుటె నాకు గండమయ్యేనురో
మధ్యధర సాముద్రమంతయు మంటబాంబులు గంటగంటకు
వొంటిగాను ఉంటె నన్ను గెంటి బంటును జేసివైతురు ॥ఎ॥

వ. అసలు నీ ధోరణే బాగాలేదు తమ్ముడా ! మున్ను

సీ॥ ఇంగ్లండులో మన • హితులు ఉన్నారంచు
హెస్సును బంపగా • తుస్సుమనియె
లెనిన్‌గ్రాడునుబట్టి • మన్ను చేయుదునంచు
కూసిన కూతలు • కోతలయ్యె
మాస్కోను ఇప్పుడే • మసిచేయు దంటివి
దాని ఛాయలనైన • డాయవైతి
అబిసీనియానంత • ఆక్రమించిరివాళ్ళు
ఆఫ్రికా జేరిరి • అదటుహెచ్చె
తే॥ గీ॥ మొండిధైర్య బుతో నీదు • అండజేరి
హిట్లరా నిన్ను నమ్మితి • ఇన్నినాళ్లు
ఏమిచేయగనుంటివో • ఎరుకరాదు
స్టాలినన్నను మన గుండె • రాదుమనును

హిట్లరు :—ఛీ, పిరికిపందా ! అసలు....

టోజో :—అది అటుండనీయి అన్నా !

కీ ర్తన॥ ఇంతయేల అన్నా - సుంత నేదెప్పెద విను
అన్నా నే జెప్పెద - ఆలింపుమోరన్న
ఎడతెగనీ యుద్ధంబూ - ఎన్నేళ్ళు చేసినా
చైనాలో ఒక్కంతా - చెక్కయినా చెదరదుగా
కన్నుల కెన్నెన్నో - వన్నెలు కొలిపేటి
దేశాలు జేబట్ట - దీవుల కాలెట్టి

మలయా, బర్మాలను - బలముతో చేకొంటి
ఇండియా ప్రజలెవ్వ - రండజేరకపోయె
ముందుకె పోవంగ - సందేమి చిక్కదుగా॥

కాకసస్సు దాటేసి - కదలి వచ్చావంటె
భారతదేశాన్ని - భాగించుకొందాము॥

హిట్లరు :—(ఆప్యాయంగా ముసోలినీ వంక తిరిగి) ముద్దు సోదరా! (టోజోవంక దిరిగి) చిట్టితమ్ముడా! తుది ప్రయత్నంబుగావించి ఎదిరి నిల్చిపోరువారి మదమణగించ లెండి. ఈపాటి కార్యంబులతరి ఆలసించిన ఆశాభంగము - రండి—

కీర్తన॥ వినుడి, వినుడి నా వీరప్రతాపము
వివరింతును మీకు —
సాటిలేని బల్మెటితనముతో
సాంతముజేతును శతృబలగమును ॥వి॥

స్టాలినేంత - స్టాలిన్‌గ్రాడెంతరా
పక్షపక్షములకు - లక్షలసైన్యము
వందల టాంకులు - వేల విమానాల్
లక్షలగుండులు - అక్షయసైన్యము
అంపెద శత్రులు - జంపెద నిక్కము
యుద్ధభూమికి - సిద్ధము కండి

అని యీ ప్రకారంబుగ యుద్ధమునకు హిట్లరు సన్నద్ధంబై అనేకబలగంబులతో వడివడి అనికిజనె. నాజీసైన్యంబున కెదురై ఎర్రసైన్యంబు చీల్చిచెండాడె. స్టాలిన్‌గ్రాడ్ పరాజయంబు మొదలుకొని చలికాలములోను. వేసవికాలములోను ఎర్రసైన్యంబు హిట్లరును తరిమి తరిమి వరుసగా ఖార్కావ్, స్మోలెన్స్క మొదలైనవి బట్టుకొని, రష్యను భూమి నుండి నాజీహంతకులను తరిమివైచుచుండె. అటు మిత్రసైన్యంబులు ఆఫ్రికానంతయు ఆక్రమించుకొని, సిసిలీని వశపరచుకొనిరి. ముసోలినీపై బదోగ్లియోప్రభుత్వంబు తిరుగబడి అతనిని బందీచేయ ఎట్టులో హిట్లరు తప్పించి జర్మనీకి తీసుకొనిపోయె. క్షణక్షణము అపజయవార్తలను, ఆక్రమితదేశాల తిరుగుబాటు వార్తలను వింటున్న హిట్లరు తన సోదరులతో ఏమంటున్నాడయ్యా.

ఏదిరా దారిక సోదరా మనకిక
బ్రతికియుండుటకన్నా పడిచచ్చు చేమేలు
ఏగోలాలై యుగొస్లావులా
గెరిల్లాలట తరుముచుండిరి
ఫ్రెంచివా రెదురించుచుండిరి
పరాజయంబె ప్రతిఫలంబౌ

(అని నిష్క్రమింతురు)

# మంగళం

భారత వీరులంత ప్రతినలు జేయగాను
జనని భారతమాతా జయమంగళం ॥నిత్య॥

హిట్లరు అంతముతో. టోజో సాంతముతో
ప్రపంచప్రజలంత ప్రశాంతమొందగాను
జయమంగళం ॥మాతా॥

శుభ మంగళం

— కోగంటి గోపాలకృష్ణయ్య

# పి లు పు

రైతు మహాసభ వచ్చించి,
భారత
రైతు మహాప్రభ లేచింది
ఐక్యతతో రైతాంగమంతయూ
జై జై జై యని జయముపల్కగా ॥రైతు॥

కాంగ్రెస్-లీగుల కలయికకోసం
హిందూ ముస్లిం ఏకతతో ॥రైతు॥

క్షామ పీడితుల కన్నవస్త్రముల
నందజేయుటకు ప్రతినబూనగా ॥రైతు॥

అధికాహారోత్పత్తికి రైతుల
దీక్షాదక్షత లినుమడించగా ॥రైతు॥

దేశ రక్షణకు, దాస్య విముక్తికి
దేశీయులు ముందడుగు వేయగా ॥రైతు॥

దేశ భక్తులను మూసిపెట్టిన
జైళ్ళ తాళములు సడలగొట్టగా ॥రైతు॥

స్వతంత్ర భారతజాతి పతాకం
చూపుమేరలో చూపట్టంగా ॥రైతు॥

జాతీయ ప్రభుత్వ స్థాపనకొరకై
దేశభక్తి సందేశముతో ॥రైతు॥

— "విద్వాన్ ప్రయాగ"

## చ ద వం డి

- స్వాతంత్ర్య సంగ్రామం
- సామ్రాజ్యవాదం
- జాతులసమస్య
- భారతకమ్యూనిస్టుపార్టీ నిర్మాణచరిత్ర
- నిర్మాణసమస్యలు
- లెనిన్ పల్లెటూరి పేదలకు
- పార్టీనిర్మాణం
- ప్రజానాయకుడు స్టాలిన్

48

